## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 99999990175549

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

నవశిక్షిత సాహిత్యమాల

# కోళ్ళ పెంపకం


రచన

జమ్మి కోనేటి రావు

చిత్రాలు

సబినిత దేశ్‌ప్రభు





నేషనల్ బుక్‌ట్రస్ట్, ఇండియా

ఈ పుస్తకం రాష్ట్రవయోజనవిద్యా వనరుల కేంద్రం, హైదరాబాదు,
ఆంధ్రప్రదేశ్ మరియు నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా సంయుక్తంగా
నిర్వహించిన వర్క్‌షాప్‌లో తయారు చేయబడినది.

ISBN 81-237-2483-7

---

ప్రథమ ముద్రణ 1998 *(శక 1920)*



KOLLA PEMPAKAM *(Telugu Original)*

రూ. 7.00

డైరెక్టర్, నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా, ఎ-5, గ్రీన్‌పార్క్,
న్యూఢిల్లీ - 110016 ద్వారా ప్రచురింపబడినది.

---

# కోళ్ల పెంపకం

మనదేశ జనాభా ఏటా పెరిగిపోతోంది. పంటలు బాగా పండిస్తున్నారు. అయినా అందరికి సరిపోయినంత ఆహారం అందడంలేదు. రాబోయే కాలాల్లో ఈ పరిస్థితి మరీ ఇబ్బంది అవుతుంది. వరి, గోధుమ వంటి గింజలు బలమైనవే కాని మంచి పోషక విలువలు తక్కువ. చేపలు, పాలు, గుడ్లు మంచి పోషక విలువలు కలిగినవి. చాలా బలమైన ఆహారం.

అయితే అనాది నుంచి మానవుడు గుడ్లు తింటున్నాడు. కాని అవి తక్కువే. కోళ్లపెంపకం వల్ల కోడిమాంసంతోబాటు గుడ్లు మనకి అందుతాయి. గతంలో కోళ్లపెంపకం వేరు. ఈనాటి విధానం వేరు. ఇప్పుడు ఎన్నో సదుపాయాలు మనకు అందుబాటులో ఉన్నాయి.

## నాటుకోళ్ల పెంపకం

ఇటీవల కోళ్లపెంపకంలో శ్రద్ధ ఎక్కువ అవుతోంది గతంలో దేశవాళీ కోళ్లను బయట వదలిపెట్టేవారు. అవి అలా తిరిగి ఆహారం సంపాదించు కొంటాయి. అంతగా కట్టుబాట్లు ఉండేవి కావు. అయితే ఇప్పటికీ గ్రామాల్లో ఇదే పద్ధతిని చూస్తాము. రాత్రి వాటిని గంపల కింద దాస్తారు.

## ఆధునిక కోళ్ల పెంపకం

ఇటీవల కోళ్ల పెంపకం ఆధునిక పద్ధతుల్లో జరుగుతోంది. గ్రామాల్లో పట్టణ శివార్లలో బాగా వ్యాపించింది. చాలా మంది మంచి లాభాలను

గడిస్తున్నారు. స్వయం ఉపాధి కార్యక్రమాలలో ఈ పరిశ్రమ ముందుంది. వ్యవసాయదార్లకు అదనపు ఆదాయం అందుతోంది. ఈ కృషి సర్వ సామాన్యం అయింది.

కోళ్ల పరిశ్రమలో సదుపాయాలు చాలా ఉన్నాయి. ఇబ్బందులు తక్కువ. ఈ దిగువ చూడండి :

1. చిన్న సన్నకారురైతులు దీనిని చేపట్టవచ్చును. స్వంతంగా కూడా ఎవరైనా దీనికి పూనుకోవచ్చు.
2. యంత్రాలు పరికరాలు వేరే అవసరంలేదు. కుటీర పరిశ్రమగా చేసుకోవచ్చును.
3. కోళ్లపెంపకం ఏడాది పొడవునా ఉంటుంది. ఎండలు, వానలు, చలి దీనికి ఆటంకం కాదు. వర్షాలు పడకపోతే పంటలు పండవు. కాని ఈ పరిశ్రమకి ఆటంకం కాదు. వరదలు వచ్చినా ఇబ్బందిలేదు.
4. మన అవసరం ఆర్థిక పరిస్థితిని బట్టి కొద్దిపాటి స్థలంకూడా సరిపోతుంది.
5. పెట్టుబడి త్వరలోనే మన చేతికి తిరిగివస్తుంది.
6. వాటి పెంట ఎరువుగా ఉపయోగపడుతుంది.
7. మాంసపు కోళ్లను బ్రాయిలర్లు అంటారు. వీటి మీద పెట్టుబడి రెండు నెలల్లో తిరిగి సంపాదించగలం.
8. అమ్మకాలు జరగవేమోనని బెంగలేదు. గుడ్లు, కోడి మాంసం అందరికి కావాలి. ఏ కాలం అయినా అమ్ముడవుతాయి.
9. ఋణాలు సేకరించడానికి వీలుంది. బ్యాంకులు, ప్రభుత్వం ముందుకు వచ్చి అప్పులు ఇస్తాయి.
10. సరియైన నిర్వహణ యాజమాన్యం ఉండాలి. అప్పులు తీరిపోతాయి. లాభాలు, ఆదాయం వస్తుంది. పరిశ్రమ ముందుకు పోతుంది.

# కోళ్ల ఫారాలు

కోళ్లను పెంచే నిలయాలను కోళ్ల ఫారాలు అంటారు. కొద్ది కాలంలోనే దేశం ఈ రంగంలో ముందడుగు వేసింది. అయినా తగినన్ని గుడ్లు అందడంలేదు. ఇంకా ఎన్నోగుడ్లు దిగుబడి అవాలి. జీవన ప్రమాణాలు అధికం అవుతున్నాయి. ప్రజలకు ధనం బాగా వస్తోంది. కోడిగుడ్లు, కోడిమాంసం అవసరం పెరుగుతోంది.

కోడిగుడ్డులో సమతూకంగా ఆహారం ఉంది. ప్రొటీనులు, విటమినులు, ఖనిజలవణాలు బాగా లభిస్తాయి.



రాష్ట్రంలో లక్షలాది ప్రజలు ఈ పరిశ్రమలో ఉన్నారు. ఆ ఆధారంతో జీవనోపాధి పొందుతున్నారు. ఇతర రాష్ట్రాలకు విదేశాలకు గుడ్లు ఎగుమతి అవుతున్నాయి. ఆర్థికంగా లాభపడుతున్నారు. సుమారు 2 లక్షల కోళ్ల ఫారాలు రాష్ట్రంలో ఉన్నాయి. ఇంకా స్థాపించుకోవాలి.

## కోళ్ల ఫారమ్ స్థాపించాలను కొంటున్నారా?

కోళ్లను పెంచాలని మీకు అనిపిస్తోందా? అయితే ముందు ఈ విషయాలను గుర్తుంచుకోండి:

1. కోళ్ల పెంపకానికి తగిన వసతి ఉందా? ఇతర సౌకర్యాలు అవసరాలు సమకూరుతాయా? అమ్మే అవకాశాలు, సదుపాయాలు ఉన్నాయా?
2. కోడి పిల్లలు దొరకుతాయా? వాటిపెంపకానికి కావలసిన మెళుకువలు తెలుసుకొన్నారా?
3. కోళ్ల వ్యాధులు ఏవో బాగా తెలుసుకొన్నారా? ఆ రోగాలు రాకుండా జాగ్రత్తలు తీసుకోగలరా? వస్తే ఏ చర్యలు తీసుకోవాలో చదువు కొన్నారా? అన్ని వివరాలు రాసుకొన్నారా?
4. ఖర్చులు ఎలా ఉంటాయో గుర్తించారా? ఆదాయంఎలా పెంచు కోవాలో తెలుసుకొన్నారా? ఆదాయం ఎలా పెంచుకోవాలో గుర్తించుకొన్నారా? మంచి యాజమాన్యం అందించగలరా?

## దేశవాళీ కోళ్లలో రకాలు

దేశవాళీ కోళ్లను నాటుకోళ్లు అని అంటారు. ఇందులోనూ చాలా రకాలున్నాయి. బ్రహ్మ, ఆశీల్, గాగసీ, కొచిన్, చిట్టగాంగి కొన్ని రకాల నాటుకోళ్లు. ఇవి బాగా గుడ్లుపెట్టవు. సంవత్సరానికి సుమారు 120 గుడ్లు పెడతాయి. అయితే వాతావరణానికి బాగా తట్టుకొంటాయి. వేరే ఎక్కువగా శ్రద్ధ వహించ నవసరంలేదు. దాణా కూడా వేరే అంతగా ఇవ్వనక్కరలేదు.

## విదేశీ కోళ్లు

గత నలభయి సంవత్సరాలనుంచి పరిస్థితి మారింది. ఇతరదేశాల నుంచి రకరకాల కోళ్లు దిగుమతి అయ్యాయి. మంచి మాంసాన్ని ఇచ్చేవి కొన్ని. వీటిని బ్రాయిలర్లు అంటారు. గుడ్లు ఎక్కువగా పెట్టే రకాలు కొన్ని. వీటిని లేయర్లు అంటారు.

మొత్తానికి వీటివల్ల గుడ్ల ఉత్పత్తి చాలా అధికమయింది. కోడిమాంసం బాగా దొరుకుతోంది. అయితే వీటి పెంపకంలో చాలా జాగ్రత్తలు అవసరం. నాటుకోళ్ల మాదిరిగా చూడకూడదు. వాటిని విచ్చలవిడిగా వదల కూడదు. బయట ఎండకి చలికి వాటికి ఇబ్బంది అవుతుంది. వాటికి తగిన సౌకర్యాలు ఇవ్వాలి. అప్పుడు గుడ్ల దిగుబడి పెరుగుతుంది.

## విదేశీ కోళ్లు పెంపకం పద్ధతులు

కోళ్ల పెంపకంలో ముఖ్యంగా రెండు పద్ధతులు ఉన్నాయి. ఒకటి డీప్‌లిట్టర్ పద్ధతి. దీనిని పొట్టు పద్ధతి అని కూడా అంటారు. రెండవది కేజ్ పద్ధతి. దీనిని పంజరం పద్ధతి లేదా బోను పద్ధతి అనీ అంటారు.

కోళ్లపెంపకంలో వాటికి రక్షణ సదుపాయం అవసరం. ముందు పాకలు వేసుకోవాలి. తాటాకు లేదా సిమెంట్ రేకులు ఉపయోగించు కోవచ్చు. వర్షం నీరు లోపలకి రాకుండా చూసుకోవాలి. ఇందుకు ఎత్తైన ప్రదేశంలో పాకలు వేసుకోవాలి. పగటి పూట ఎండ పొడ బాగా తగలాలి. పాకలు తూర్పు పడమరలుగా వేసుకోవాలి. ఎండ పొడ వల్ల కోళ్లకి విటమిన్-డి అందుతుంది. వెలుతురు కూడా బాగా అందుతుంది. పాకల్లోకి గాలి బాగా చొరాలి. అలా అయితే క్రిములు చేరవు. పాక పొడిగా శుభ్రంగా ఉంటుంది. పాకలు ఉత్తర దక్షిణాలుగా కట్టుకొంటే ఎండ సూటిగా పడుతుంది. అది మంచిది కాదు.

పాకల గచ్చు సిమెంట్‌తో తాపడం చెయ్యాలి. లేదా నాపరాళ్లు

పరుచుకోవాలి. చుట్టూ రక్షణ కల్పించాలి. ఎత్తుగా జల్లెడతీగ గట్టిగా కట్టుకోవాలి. ఆ విధంగా కాకులు, పాములు ఎలుకలు లోపలికి రావు. చలికాలం, వానాకాలం అదనంగా తెరలు కట్టుకోవాలి.

## డీప్‌లిట్టర్ పద్ధతి

ఈపద్ధతిలో పై విధానంలో పాకలు వేసుకోవాలి. తరువాత నేల మీద వరి ఊక దట్టంగా పరుచుకోవాలి. రంపపు పొట్టు, వేరుశెనగ పొట్టు కూడా వాడవచ్చు. ఎండుగడ్డి, ఎండుటాకులు అయినా మంచివే. ఏవయినా కనీసం 15 సెం.మీ. మందం ఉండాలి. చలికాలంలో ఎక్కువగా 15-20 సెం.మీ. ఉండాలి, ఎండాకాలంలో తక్కువగా 10-15 సెం.మీ. ఉండాలి.

## పొట్టు ఎలా ఉండాలి?

పొట్టు ఎప్పుడూ పొడిగా ఉండాలి. కోళ్లరెట్టలు పడుతూ ఉంటాయి. నీళ్లు ఒలికి పొట్టు తడిసిపోతుంది. అందుకని పొట్టు కొన్ని సార్లు కలియబెడుతూ ఉండాలి. కోడి రెట్టలవల్ల అమ్మోనియా వస్తుంది. ఇది విషంతో సమానం. ఈ గాలివల్ల కోళ్లకు జబ్బులు వస్తాయి. కొద్ది వారాలకి ఒకసారి పొట్టు మార్చుకోవాలి. మార్చిన పొట్టు ఎరువుగా పనికి వస్తుంది. ఇలా మార్చినపుడు పురుగుల మందు చల్లాలి.

ఒక్కొక్కపాకలో 250 కన్నా ఎక్కువ కోళ్లు ఉండకూడదు. ఇంకా ఎక్కువ కోళ్లు ఉంటే రెండు పాకలు వేసుకోవాలి. పాకకి-పాకకి మధ్య దూరం 10-12 మీటర్లుండాలి.

పాకలో కరెంటు బల్బులు లేదా ట్యూబులు అమర్చాలి. రాత్రిపూట కోళ్లకి వేడి వెలుతురు అందుతాయి. బల్బులు కనీసం రెండు మీటర్లు ఎత్తులో అమర్చాలి. మొదటి ఏడు వారాలు కోడిపిల్లలకి ఈ సదుపాయం ఉండాలి.

## కోళ్లకి దాణా, నీరు సదుపాయం

కోళ్లకి నీరు, ఆహారం అందించాలి. కోళ్ల సంఖ్యని బట్టి ఇవి అమర్చు కోవాలి. 20 కోళ్లకి ఒక ఆహార తొట్టె ఉండాలి. కోళ్లమేత వాటిలోనే వెయ్యాలి. తొట్టి పూర్తిగా నింపకూడదు. నింపితే దాణా వృధా అవుతుంది. కింద పడిపోతుంది. అందుకని వెలితిగా వేసుకోవాలి. ఆహారం తాజాగా ఉండాలి. నీళ్ల తొట్టెలని నింపు కోవాలి. ఈ పాత్రలన్నీ ఎప్పటికప్పుడు శుభ్రంగా కడగాలి.

అవసరంబట్టి ఒకేపాకలో రెండు అంతస్థులు కట్టుకోవచ్చు. ఇలాంటి డీప్‌లిట్టర్ పద్ధతి చాలా అనువైనది. అయినా చాలామంది దీనిని వదిలేసారు. కొద్ది మంది మాత్రం ఈ పద్ధతిలో ఇంకా కోళ్లను పెంచుతున్నారు.

## కేజ్ పద్ధతి లేదా బోనుపద్ధతి

చాలా మంది ఇటీవల కేజ్‌పద్ధతిలో కోళ్లను పెంచుతున్నారు. నాలుగింట మూడొంతులు దీనిని అనుసరిస్తున్నారు. ఇది మరింత సదుపాయకరం అంటారు. దీనినే గూడుపద్ధతి, పంజరం పద్ధతి అంటారు. ఈపద్ధతిలో ఇనుపబోనులు వరుసగా ఉంటాయి. అవసరం అయితే వీలుచూసుకొని ఎక్కువ వరుసలు అమర్చు కోవచ్చు. గూడు కొంచెం పెద్దది అయితే 3, 4 కోళ్లు ఉంచవచ్చు. లేకపోతే ఒక్కొక్క చిన్న గూడులో ఒకే కోడిని ఉంచవచ్చు. చుట్టూ వైర్‌మెష్ ఉంటుంది. అయితే చాలా బలంగా కట్టాలి. ఊచలు ఊడిపోకూడదు. బోనులకు దగ్గరగా నీళ్లు, ఆహారం అందించాలి.

## సదుపాయాలు

కేజ్‌పద్ధతిలో కొన్ని సదుపాయాలు ఉన్నాయి. పనులకి ఎక్కువమంది అవసరం ఉండదు. స్థలం కలిసి వస్తుంది. ప్రతి పంజరం రోజూ పరీక్షించి లోటుపాట్లు తెలుసుకోవచ్చు. కోళ్లు ఒకదానినొకటి

పొడుచుకోవు. అలాటివి ఉన్నా వాటిని సులభంగా గుర్తించవచ్చు తీసివేయవచ్చు. రోగానికి గురిఅయిన వాటిని గుర్తించవచ్చు. వేరు చేయవచ్చు. దీనివల్ల రోగాలు అదుపులో ఉంటాయి. కోడిరెట్టలు సులభంగా ఎత్తివేయవచ్చు. గుడ్లను రోజూ సులభంగా సేకరించవచ్చు.

## లోటుబాట్లు

కాని ఈ పద్ధతిలో కొన్ని లోటుబాట్లు ఉన్నాయి. కోడిగుడ్లు అప్పుడప్పుడు కొద్దిగా చిట్లవచ్చు. ఒక్కొక్కబోను విడిగా శుభ్రం చేయాలి. ఇది కొంత శ్రమతో కూడిన పని. విడివిడిగా అన్నిటికి ఆహారం ఇవ్వడం కూడా కష్టమే!

అన్నిటికి మించి కోళ్లకు ఒక విధమైన పక్షవాతం జబ్బు వస్తుంది. కోళ్లు ఒక పక్కకి ఒరిగి పోతాయి. కోళ్ల కాలేయంలో కొవ్వు పెరుగుతుంది. దీనివల్ల గుడ్ల దిగుబడి తరిగి పోతుంది. అయితే ఈ రెండు లక్షణాలు కనబడితే వాటిని తీసివేయాలి.

## మంచి కోడి ఎలాఉంటుంది?

కోడి మంచి ఆరోగ్యంగా ఉండాలి. కొన్ని గుణాలను చూసి వాటిని గుర్తించవచ్చు. అవేవో తెలుసుకొంటే అలవాటు ప్రకారం మంచికోడిని గుర్తించవచ్చు.

కోడి హుషారుగా శక్తివంతంగా ఉండాలి. ముక్కుపొట్టిగా ఉండాలి కోడి కంకం మెత్తగా దూదిలా ఉండాలి. రెట్ట రంధ్రం చెమ్మగా వెడల్పుగా ఉండాలి. క్రమం తప్పకుండా సుమారు రోజుకొకటిగా గుడ్లు పెట్టాలి. గుడ్లు పెద్దవిగా ఉండాలి. మంచికోడి సంవత్సరానికి సుమారు 260 గుడ్లు పెడుతుంది.

ఇక గుడ్లనుంచి వచ్చిన పిల్లలు త్వరగా ఎదగాలి. తినిన ఆహారానికి తగిన విధంగా శరీరం కండ పెరగాలి. దాణా ఎక్కువ, దిగుబడి తక్కువ అవకూడదు.

## కోడి మగత

కొన్ని కోళ్లు గుడ్లు పెట్టవు, మత్తుగా బద్ధకంగా కూర్చొంటాయి. గుడ్లు పొదుగుతున్నట్లే ఉండిపోతాయి. కాని గుడ్లు పెట్టవు. వాటికి తగిన ఇంజక్షన్లు ఇవ్వాలి. అప్పుడు సర్దుబాటు అవుతుంది. లేకపోతే ఆ కోడి ఇంక గుడ్లకు పనికిరాదు. దానిని అమ్మేయాలి. ఈ లక్షణమే కోడిమగత.

## బ్రాయిలర్ కోడి

కొన్ని కోళ్లను మాంసానికని ప్రత్యేకంగా పెంచుతారు. వాటిని మాంసం కోళ్లు అంటాము లేదా బ్రాయిలర్లు అంటాము. వీటి శరీరం త్వరగా ఎదగాలి. తొడలు, గుండెల దగ్గర కండ బాగా కనబడాలి. ఛాతీభాగం విశాలంగా ఉండాలి. సులభంగా వంగగల్గాలి.

కొన్నిరకాల కోళ్లు రెండిటికి వీలయినవే. మాంసానికి మాంసం ఇస్తాయి, గుడ్లను బాగా పెడతాయి. కాని వాటిని పెంచడానికి చాలమంది ఇష్టపడరు.

## కోడిపిల్లల పెంపకం

గుడ్ల నుంచి పిల్లలు వస్తాయి. దీనికి గుడ్లను పొదగాలి. కొన్ని రోజులు వాటిని శ్రద్ధగా పెంచాలి. సాధారణంగా ఇది తల్లి పని. కాని ఈ రోజుల్లో తల్లి అవసరం లేదు. పొదగడానికి ప్రత్యేక పరికరాలు ఉన్నాయి. ఇదొక యంత్రంలాంటిది. దీనిని ఇంకుబేటరు అంటారు. ఇవి పిల్లలను పొదిగే కెంద్రాలలో ఉంటాయి. ఈ కేంద్రానికి హేచరీ అంటారు. ఈ కేంద్రంలో పెంచడానికి వేరే బ్రూడర్ అనే యంత్రం ఉంటుంది. ఇందులో అన్ని కాలాల పిల్లలను పెంచగలరు. పిల్లలు చనిపోవడం ఉండదు. గద్దలు ఎత్తుకొనిపోవు.

ఒక బ్రూడర్‌లో 250 వరకు కోడి పిల్లలను ఉంచవచ్చు. కరెంటు

దీపాలతో దీనితో వేడిని పుట్టిస్తారు. ఇతర రకాల దీపాలు కూడా వాడతారు. ముందు మూడు రోజులు దానిలో వెచ్చగా ఉండాలి. అంటే గోరువెచ్చని నీటి వేడి ఉండాలి. తరువాత కొంచెం కొంచెం తగ్గిస్తూ రావాలి. ఒక నెల రోజుల్లో మామూలు వేడి ఉంటేచాలు. ప్రత్యేకంగా వేడి కల్పించ నవసరంలేదు. మొత్తానికి కోడి పిల్లలకి ఆరోగ్యం బాగుండాలి. ఆ వాతావరణం కల్పించాలి.

అన్ని రకాల వాక్సినేషన్లు ఇప్పించాలి. ఆవిధంగా కోళ్లకు రోగాలు రావు.

## కానిబాలిజమ్

కోళ్లలో ఒక చెడు అలవాటు ఉంది. వేరే కోళ్లను పీకుతూ పొడుస్తూ ఉంటాయి. ఇలాటి కోళ్ల లక్షణాన్ని కానిబాలిజమ్ అంటారు. వాటిని ఏరి వేయాలి. ఇతరత్రా ఉపయోగించుకోవాలి. ముఖ్యంగా మాంసానికి అమ్మేయాలి. ఇలా చేయడం వల్ల మేత కలసివస్తుంది.

## ముక్కు కత్తిరింపు

కోళ్లలో కానిబాలిజమ్ తగ్గించడానికి ముక్కు కత్తిరిస్తారు. దీనికి డీబీకింగ్ అంటారు. రెండు దవడలు నాలుగోవంతు తీసేస్తారు. లేదా కింది దవడలో మూడోవంతు కత్తిరిస్తారు. ఇలా దవడలు కత్తిరించడానికి ప్రత్యేక పరికరాలుంటాయి. దీనివల్ల ఆహారం తీసికోడానికి వాటికి ఇబ్బంది ఉండదు.

ఎదుగుతున్న పిల్లల్లో 21 రోజు ఒకసారి ఇలా కత్తిరించాలి. 18 వారాల వయసులో రెండవసారి ఇదేపని చెయ్యాలి.

## డుబ్బింగ్

కోడి కంకం దాని తల మీద అందమైన తురాయిలాటిది. అయితే

దానికి ఉపయోగం ఏదీ లేదు. దానిని తీసేస్తే దానికి నష్టం లేదు. మనకి మాత్రం లాభం. 2 శాతం గుడ్లు అధికంగా పెడుతుంది. అంటే ఏడాదికి ఒక కోడికి అయిదు గుడ్లు ఎక్కువ వస్తాయి. ఇలా కంకాలని కత్తిరించడం డుబ్బింగ్ అంటారు.

## మెయ్యి కోళ్లు

కొన్ని కోళ్లలో కొవ్వు బాగా పెరుగుతుంది. రెట్ట రంధ్రంలోనుంచి గుడ్లు పెట్టే కాలవ బయటకి వస్తుంది. ఇలాంటి కోళ్లను మెయ్యికోళ్లు అంటారు. మిగతా కోళ్లు దీనిని పట్టి పీకుతాయి. మెయ్యికోళ్లను వేరుగా పెంచాలి.

## చికాకు, వత్తిడి

కోళ్లకు చికాకు, వత్తిడి ఉండకూడదు. సహజంగానే గుడ్లు పెట్టాడానికి కోడికి శక్తి అవసరం. వత్తిడి వల్ల శరీర వేడిలో హెచ్చుతగ్గులు వస్తాయి. వాటిని కోడి సర్దుబాటు చేసుకోవాలి. దీనికి చాలాశక్తి ఖర్చు అయిపోతుంది. గుడ్లుపెట్టేశక్తి తరిగిపోతుంది. కాబట్టి ఈపరిస్థితులు సరిచేసుకోవాలి. నాటుకోళ్లు గుడ్లు తక్కువ పెట్టడానికి ఇదొక కారణం.

వత్తిడికి కారణాలు ఉన్నాయి. కోళ్లకు పేలు, పురుగులు పట్టడం ఒకటి. వేడి, వెలుతురు, ఆహారం, నీరు సరిగా ఉండడం రెండోటి. ఇవి సరిగా లేకపోయినా వత్తిడి ఎక్కువ అవుతుంది. వాతావరణం చక్కగా ఉండాలి. ప్రకృతి వాతావరణం వాటికి చికాకు కలిగించవచ్చు. ఎండ తీవ్రంగా కాస్తుంది. లేదా చలి ఎక్కువగా ఉంటుంది. వాటి ప్రభావం కోళ్ల మీద పడుతుంది. ఇలాంటి పరిస్థితులకి అవి లోనుకాకూడదు.

కాకులు, పాములు, ఎలుకలు, కుక్కలు, పిల్లులు లోపలికి దూరతాయి. ఇవి లోపలికిపోకుండా జాగ్రత్తపడాలి. కట్టుదిట్టంగా ఉండాలి. లేకపోతే వాటికి అలజడి, చికాకు కలుగుతుంది. వత్తిడి ఎక్కువ అవుతుంది. గుడ్లు సరిగాపెట్టవు.

మందు వేసవిలో కూడా పాకలో చల్లగా ఉండాలి. దీనికి పైనుంచి నీళ్లను చల్లుతూ ఉండాలి. దీనికి ప్రత్యేకంగా పరికరాలు ఉన్నాయి. వీటిని స్ప్రింకర్లు అంటారు.

## శుభ్రత

కోళ్ల పాకలలోకి వెళ్లేవారు చాలా శుభ్రంగా ఉండాలి. వెళ్లేముందు ఫినైల్‌తోకాని, డెట్టాల్‌తోకాని కాళ్లు చేతులు శుభ్రంగా కడుగుకోవడం మంచిది.

## మార్కెటింగు

కోళ్ల పాకలు పెట్టుకొన్న చోటు జాగ్రత్తగా ఎంపిక చేసుకోవాలి. అమ్మకాలు బాగా జరిగే వీలుండాలి. రవాణా, కరెంటు, నీటి సదుపాయాలు ఉండాలి. మార్కెట్‌దగ్గిరగా లేకపోతే రవాణా ఖర్చులు ఎక్కువ అవుతాయి. సరుకు చెడిపోవచ్చు.

అలాగ అని కోళ్ల పాకలు ఊరి మధ్యలో ఉండకూడదు. జనావాసాలకు దూరంగా ఉండాలి. పట్టణ శివార్లు మంచి స్థలాలు. అయితే కొద్ది కొద్ది కోళ్లను పెంచు కొనేవారు ఇళ్ల దగ్గర పెంచుకోవచ్చు.

## హాచరీలు

కొన్ని సంస్థలు కోడి పిల్లలను అమ్ముతాయి. వాటిని హాచరీలు అంటారు. వీరు మంచి మంచి లక్షణాలున్న పుంజులను పెట్టలను ఎంపిక చేస్తారు. వాటికి జతకడతారు. వాటి గుడ్లను ఇంకుబేటర్లలో పెట్టి పిల్లలు చేయిస్తారు. రెండు రకాల కోడి పిల్లలను సరఫరాచేస్తారు. బ్రాయిలరు, లేయరు పిల్లలు దొరుకుతాయి. ఒకరోజు వయసుపిల్లలు తెచ్చుకోవాలి. పెపంకంలో సాధారణంగా రెండిటికి ఒకే జాగ్రత్తలు అవసరమవుతాయి.

## ముందు చర్యలు

షెడ్లు, బోనులు నెలరోజులముందే తయారు చేసుకోవాలి. పాత లిట్టర్ ఉంటే తీసేయాలి. పురుగుల మందుతో పాకలని మొత్తం కడగాలి. పై కప్పులు కూడా కడగాలి. నీళ్ల తొట్టెలు, దాణాతొట్టెలు కూడా కడగాలి.

## కోళ్ల ఫారమ్ మొదలు

పిల్లలకి మొదట హాచరీలలోనే టీకాలు వేస్తారు. వాటిని తెచ్చి బ్రూడర్లలో పెట్టుకోవాలి. ఒక బ్రూడర్‌లో ఉండే కోడి పిల్లల వయసు ఒకటిగానే ఉండాలి. తేడాలుండ కూడదు. ఉంటే పోట్లాటలు తగవులు ఎక్కువ అవుతాయి.

బ్రాయిలర్ పిల్లలని వేసవిలో 15 రోజులు బ్రూడర్‌లో ఉంచాలి. మిగతా కాలాల్లో అయితే నెల రోజులుండాలి. వాటి పెరుగుదల వారానికి 200-250 గ్రాములుంటుంది. ఆ పెరుగుదల లేకపోతే అవి పనికిరావు. మేత ఎక్కువ, ధర తక్కువ అవుతాయి.

అయితే కోళ్లకి మేత ఎక్కువ వేయకూడదు. ఇలా పెడితే గుడ్లు చిన్నవి అవుతాయి. వత్తిడి ఎక్కువయి వ్యాధులకి గురి అవుతాయి.

ఆహార విషయంలో ఒక ముఖ్యవిషయం ఉంది. అన్ని వయసులలోనూ ఒకే మేత పనికిరాదు. ఇది గమనించుకోవాలి.

## మరిన్ని వివరాలు

**పౌల్ట్రీ :** కోళ్ల పెంపకాన్ని పౌల్ట్రీ అంటారు. పౌల్ట్రీ అంటే చాలా రకాల పక్షుల పెంపకం. బాతులు, గిన్ని కోళ్లు, టర్కీకోళ్లు, పావురాలు మొదలైనవి పెంచుకోవడం. అయినా కోళ్ల పెంపకమే ఎక్కువ లాభదాయకం.

గతంలో : వేలాది సంవత్సరాలకింద మన పూర్వీకులు అడవిలోని

కోళ్లను తెచ్చి ఇంటిలోనే పెంచడం ప్రారంభించారు. కోడి పెంపకం ఒక వినోదంగా ప్రారంభమయింది. ఇది మన దేశంలోనే మొదట జరిగింది. కుక్క రాత్రిపూట కాపలాకాసేది. ఇది ఉదయాన్నే నిద్రలేపించేది. క్రమంగా మానవుడు కోడిమాంసం గుడ్డు ఉపయోగం తెలుసుకొన్నాడు. అవి తన ఆహారంలో భాగం అయ్యాయి.

## కోడి గుడ్ల ఉత్పత్తి

మనదేశంలో సంవత్సరానికి సుమారు 2500 కోట్ల గుడ్లు ఉత్పత్తి అవుతున్నాయి. అంటే ప్రతిమనిషికి నెలకి రెండు గుడ్లు అన్నమాట. ఇది ఎంత తక్కువో మీకు తెలిసే ఉంటుంది.



మనరాష్ట్రంలో రోజుకి ఒకటిన్నర కోట్ల గుడ్లు ఉత్పత్తి అవుతున్నాయి. సంవత్సరానికి 600 కోట్ల గుడ్లు అనాలి. అంటే దేశం ఉత్పత్తిలో నాలుగవవంతు మనరాష్ట్రంలోనే ఉత్పత్తి అవుతున్నాయి కదా. ఇందులో మన రాష్ట్రం ముందంజ వేసింది. అయితే ప్రపంచంలో మన దేశానిది నాలుగోస్థానం.

## కోడి గుడ్డు, కోడి మాంసం పోషక విలువలు

కోడి గుడ్డులో పోషక పదార్థాలు సమతూకంలో ఉంటాయి. ప్రోటీన్లు 13 శాతం. కొవ్వు కూడా 13 శాతం. కెలొరీశక్తి కూడా ఎక్కువే. ఖనిజ లవణాలు చాలా ఉంటాయి. కోడి మాంసంలో ప్రోటీన్లు 26 శాతం. కొవ్వు తక్కువగా ఉంటుంది. కెలొరీశక్తి కూడా అధికం. ఖనిజ లవణాలు పుష్కలంగా ఉంటాయి. రెంటిలోను ఎ, డి విటమినులు ఉంటాయి. కాని. సి విటమిను మాత్రం ఉండదు.

కోడి తాను తిన్న ఆహారంకన్నా అధిక పోషక విలువల గుడ్లు పెడుతుంది. ఇది ఒక విశేషం. మాంసాన్నిస్తుంది. ఇదే ఈ వ్యాపారంలో లాభసాటి అంశం.

## విదేశీకోళ్ల రకాలు

వీటిలో రోడ్ ఐలండ్ రెడ్, ప్లిమత్‌రాక్, న్యూహాంప్‌షైర్, వ్యాండోట్ మంచి రకాలు. గుడ్లు బాగా పెడతాయి. మాంసానికి కూడా మంచివే. ససెక్స్ ఆర్పింగ్‌టన్, ఆస్ట్రలాప్, కార్నింగ్ మంచి మాంసాన్ని ఎక్కువ ఇస్తాయి. కాని గుడ్లు అంతగా పెట్టవు. తెల్లలెగ్‌హార్న్, మినొర్కా ఆన్కోవా మంచి తెల్లని గుడ్లు బాగా పెడతాయి. తెల్లలెగ్‌హార్న్ అందరి అభిమానాన్ని పొందింది.

## కోడికి ఎంత స్థలం కావాలి?

సాధారణంగా ఒక్కొక్కకోడికి 2 లేదా 3 చదరపు అడుగుల స్థలం కావాలి. అంటే సుమారు 0.4 చ.మీ. స్థలం. మొత్తానికి ఒక పాకలో 250 కన్నా ఎక్కువ కోళ్లు ఉంచ కూడదు. 25 కోళ్లుంటే 9 లేదా 10 చ.మీ. స్థలం కావాలి. అంటే 100 చదరపు అడుగులు. 500 కోళ్లు పెంచుకోవాలి అనుకొంటే 2 పాకలుండాలి. రెండు పాకల మధ్య దూరం కనీసం 10 మీ. ఉండాలి.

కేజ్ విధానంలో 25 కోళ్లను పెంచడానికి 75x120 సెం.మీ. బోను ఉండాలి. 3 లేదా 4 కోళ్లకి 30x40 సెం.మీ. బోను ఉండాలి.

## పిల్ల కోళ్లకి కావలసిన వేడి

మొదటి మూడు రోజులు వాటికి $33^0$ సెల్సియస్‌కావాలి. అంటే గోరువెచ్చని నీరులాంటి వేడి. తరువాత క్రమంగా నెలరోజుల్లో $12^0$ తగ్గించాలి. అంటే $21^0$ తగ్గుతుంది. ఇది మామూలుగా ఉండే వాతావరణ చల్లదనం.

## బ్రూడర్ వేడి

బ్రూడర్‌లలో కోడి పిల్లలని ఉంచుతారు. హాచరీల నుంచి రాగానే వాటిని బ్రూడర్‌లలో ఉంచాలి. బ్రూడర్ ఉష్ణోగ్రత 33-$35^0$ సెల్సియస్ ఉండాలి. పిల్లలన్నీ విచ్చలవిడిగా బ్రూడర్ అంతా తిరుగుతాయి. $35^0$ కన్నా ఎక్కువయితే బల్బుల నుంచి దూరంగా పోతాయి. $33^0$ కన్నా తగ్గితే బల్బుల దగ్గర చేరతాయి. బ్రూడర్ చుట్టూ దడిలాంటి రక్షణ కట్టుకోవాలి. పిల్లలు ఇటూ అటూ చెదిరిపోయినా ఇది అడ్డుతుంది.

బ్రూడర్‌లో 35 రోజులపాటు ఉంచుతారు. గోధుమ, మొక్కజొన్న నూక వీటికి మంచి ఆహారం. పిల్లలు పొడుచుకోకుండా 21 వ రోజు ముక్కులు కత్తిరించాలి. 9 వారాల తరువాత బల్బుల అవసరం ఉండదు. 10వ వారం జీరోకాంతి బల్బులు ఉంచుకోవచ్చు.

## కోళ్ల ఆహారం

ఆహారం విషయంలో ఒకటి గమనించాలి. అన్ని వయసులవారికి ఒకేమేత పనికిరాదు.

మూడోరోజు నుంచి రెండు నెలలవరకు చిక్‌మాష్ ఇస్తారు. ఇందులో 20 శాతం ప్రొటీన్లు ఉంటాయి. 3 నుంచి 5 నెలలవరకు గ్రోయర్

మాష్ ఇస్తారు. ఇందులో 20-25 శాతం ప్రోటీన్లు ఉంటాయి. ఏడవ వారానికి కోడి బరువు ఒకటిన్నర కిలోలు ఉండాలి. సుమారు 5 నెలల తరువాత లేయర్‌మాష్ ఇస్తారు. ఇందులో 16 శాతం ప్రోటీన్లు ఉంటాయి.

బ్రాయిలర్ విషయంలో కొంచెం తేడా ఉంటుంది. ఆరోవారం వరకు బ్రాయిలర్ స్టార్టర్ మాష్ ఇస్తారు. ఇందులో 20-25 శాతం ప్రోటీన్లు ఉంటాయి. ఏడోవారానికి దాని బరువు ఒకటిన్నర కిలోలు ఉండాలి. ఏడో వారం నుంచి బ్రాయిలర్ ఫినిష్ మాష్ ఇస్తారు. దీనిలో ప్రోటీన్లు తక్కువ. పిండిపదార్థాలు ఎక్కువ ఉంటాయి. ఎనిమిది వారాలకు వాటి బరువు ఎక్కువ అవుతుంది. ఆ తరువాత అవి ఎదగవు. అందువల్ల వాటిని అమ్మేయాలి. లేకపోతే మేత వృధా అవుతుంది.

## కోళ్ల వ్యాధులు, జాగ్రత్తలు

కోళ్ల ఫారమ్ పెట్టుకొన్నప్పుడు పై చెప్పిన జాగ్రత్తలు ఎన్నో తీసికొంటారు. అయితే, రోగాల విషయంలో ప్రత్యేక శ్రద్ధ తీసికోవాలి. లేకపోతే శ్రమ వృధా అవుతుంది. విపరీత నష్టంవస్తుంది.

ముఖ్యమైన కోళ్లవ్యాధులు వాటి లక్షణాలు తెలుసుకొందాం.

మొదటి 15 రోజుల్లో కోడిపిల్లలకి వ్యాధులు రావడానికి అవకాశాలు ఎక్కువ. రాకుండా కాపాడుకోనే శక్తి పిల్లలకి అంతగా ఉండదు.

వివరాలు చూడండి. మొదటి ఆరు వైరల్ వ్యాధులు. అంటే వైరస్ క్రిముల వల్ల వస్తాయి:

**1**. మారెక్స్‌వ్యాధి : ఇది ఎదిగే కోళ్లకు వచ్చే పక్షవాతం జబ్బు. రెక్కలు, మెడ వాలిపోతాయి. నీళ్లు తాగవు బరువు తగ్గి పోతుంది. ఇతర కోళ్లకి దూరంగా పోతాయి. చూపు మందగిస్తుంది.

**2**. కొక్కెర : ఇది అన్ని వయసుల కోళ్లకి వస్తుంది. ఊపిరి కష్టం అవుతుంది. పిల్లలైతే నిలబడలేవు.

గురకశబ్దం, ముక్కులోనుంచి నీళ్లు, ఆకు పచ్చ రెట్టలు ఈ వ్యాధి లక్షణాలు.

**3. కోడిమశూచి :** పెరిగే పిల్లలు, గుడ్లు పెట్టే కోళ్లకు సామాన్యం. చర్మం మీద నోటిలోను చిన్న చిన్న మచ్చ లుంటాయి. ఊపిరి కష్టం అవు తుంది. దోమలు ఈ వ్యాధిని వ్యాప్తి చేస్తాయి.

**4. బ్రాంకైటిస్ :** ఈ వ్యాధి గాలి, నీరు, మేత ద్వారా వ్యాపిస్తుంది. ముక్కులోనుంచి, నోటిలో నుంచి నీళ్లుకారుతాయి. నోటిలోనుంచి ఊపిరి పీలుస్తాయి. దగ్గు, గురక ఉంటాయి. పెద్దవి సరిగా గుడ్లు పెట్టవు. పిల్లలు చచ్చిపోతాయి.

**5. లారింజోట్రైకిస్ :** పెద్ద కోళ్లలో యీ జబ్బు సామాన్యం. ఊపిరి కష్టం అవుతుంది. గుడ్ల దిగుబడి తగ్గిపోతుంది. ఎక్కువగా చచ్చిపోతాయి.

**6. గంబోరో :** ఇది నెల, రెండు నెలల పిల్లలకి వస్తుంది. మేత తీసికోవు. తెల్లటి పల్చని విరోచనాలు అవుతాయి. కోళ్లు వణుకుతాయి.

ఈదిగువ నాలుగు బాక్టీరియావ్యాధులు బాక్టీరియా క్రిముల వల్లవస్తాయి:

**1. కోడి కలరా :** ఆకుపచ్చని విరోచనాలు అవుతాయి. దాణా తీసి కోవు. కోళ్లు ఎక్కువగా చనిపోతాయి.

**2. కొరైజా :** తడి పొట్టు వల్ల ఈవ్యాధి వస్తుంది. మేత తినవు. ఊపిరి కష్టం అవుతుంది. చెడువాసనతో ముక్కు కారుతుంది. కళ్లు అతుక్కొనిపోతాయి. దగ్గులు, తుమ్ములు ఉంటాయి. మొహం ఉబ్బిపోతుంది.

**3. ఊపిరి వ్యాధి :** ఊపిరి కష్టమవుతుంది. గురక వస్తుంది. ముక్కులో నుంచి చీము కారుతుంది. ఇతర రోగాలతోబాటు

ఇది సులభంగా వస్తుంది. గుడ్ల ఉత్పత్తి, కోడి బరువు తగ్గిపోతాయి.

**4.** పుల్లోరం : ఒళ్లంతా తడిగా ఉంటుంది. రెక్కలువాలి పోతాయి. గుంపులు గుంపులుగా చేరతాయి. తల్లినుంచి గుడ్లద్వారా ఈ వ్యాధి పిల్లలకి వస్తుంది. తెల్లని విరోచనాలు అవుతాయి.

## ఇతర వ్యాధులు

స్పైరోకీటాసిస్ : కోడి శరీరం మీద పేలు ఉంటాయి. వాటివల్ల ఇది వ్యాప్తి చెందుతుంది. తీవ్రంగా జ్వరం వస్తుంది. ఆకుపచ్చ విరోచనాలు అవుతాయి. దాహం, పక్షవాతం ఇతర లక్షణాలు.

ఏలికపాములు : మూడు నెలలు దాటాక ఏలికపాములు, బద్దె పురుగులు కడుపులోచేరతాయి. మందులు వాడితే చచ్చిపోయి రెట్టతో బయటపడతాయి. దీనికి డీవార్మింగ్ అంటారు.

నుమోనియా : దీనినే ఎస్పర్ జిల్లాసిస్ అంటారు. చిన్న పిల్లలకి బ్రూడర్ దశలో వస్తుంది.

**అఫ్లోటాక్సికోసిస్** : కోళ్లమేత ద్వారా వస్తుంది. చిన్న కోళ్లలో ఈ జబ్బు వస్తుంది.

కాక్సీడియోసిస్ : ఇది రక్తవిరోచనాల వ్యాధి. పిల్లలు ఒకచోట చేరతాయి. నీరు, మేత ద్వారా వస్తుంది. మనుషులు అపరిశుభ్రంగా వెళ్లినా వస్తుంది. మేత, నీరు తక్కువగా తీసికొంటాయి.

ఇవికాక శరీరం మీద పేలు మిన్నల్లులు వంటివి పట్టి వాటికి చికాకు చేస్తాయి. పోషణ లోపం తగిన విటమినులు అందక కూడా వ్యాధులు వస్తాయి. వీటిని పోషక లోపవ్యాధులు అంటారు. ఖనిజ

లవణాలు లోపించినా అంతే!

ఏదయినా వ్యాధినిరోధక చర్యలు చాలా ముఖ్యం. రోగాలు వచ్చాక అదుపుకార్యక్రమాలు తీసికోవచ్చు. కాని అప్పటికే చాలా నష్టం జరిగిపోతుంది.

ముందు జాగ్రత్త చర్యలు తీసికొంటే కోళ్ల పెంపకం ఎంతో ఆదాయాన్నిస్తుంది.

## ఆర్థిక సహాయం

స్వయం ఉపాధి పరిశ్రమలు స్థాపించాలని ఉందా? వెంటనే ఆలిండియా సెల్ఫ్ ఎంప్లాయ్‌మెంట్ అసోసియేషన్ రామన్నపేట, నల్గొండ వారిని సంప్రదించండి. ఇంకా మీ ప్రాంతంలోని బ్యాంక్‌ను సంప్రదించండి. ఇంకా స్టేట్‌ఫైనాన్షియల్ కార్పొరేషను, చిరాగ్ ఆలీ లేన్, హైదరాబాద్- 500 001 వారిని కలవండి.

Laserset at Printofast, 11/4 Old Rajinder Nagar, New Delhi - 110060 and
printed at Shivam Offset Press, Naraina Ph.1, New Delhi - 110028